రంగముఖిలలాములను ౯ రాజ్యకపీంద్రతురంగసంపదల్
సంగతి నప్పనం బొసఁగి ౯ శైలములన్ విహరింతు రెప్పుడున్ 222

వ. సంతతికిఁ గుమారతిమ్మానేఁడు మొదలు [1] 223

చ. కుదురుగ మిమ్ముఁ గొల్చి[2] వెలుగోటిపురీంద్రకుమారతిమ్మ మేల్[3]
గడియఁగ[4] నగ్రహారములు ౯ గైకొనఁ జాతురు భూసురోత్తముల్
బెదరక మాకరాసి[5] హతిఁ ౯ బెల్కుటి[6] వైరులు పోయి యూర్వశిన్
గదిసి కుచాగ్రహారములు ౯ గైకొనఁజూతు రదేమి చిత్రమో. 224

క. ఘనుఁ డాకుమారతిమ్మన
కు నయార్ణవగాశి పెద్దకొండవిభుంకున్
గనితిమ్మభూకశత్రుఁడు
పినకొండవిభుండు గల్గి ౯ పెంపొందిరిలన్ 225

వ. అందగ్రజుండు. 226

ఉ. ధీవిభవుండు రాయవిభుకేతిమ్మధరాతలనాథుపెద్దకొం
డావనిభర్త మన్నియసురాధిపుఁడో నటుగాకయున్న సం
భావితలోకపాలన మ ౯ భంగురభోగవిభూతి వజ్రభూ
షావృత[7]బాహుదండ మరకొయన్ నృపమాత్రుల కేల కల్గెడున్.[8] 227

క. ధరణిఁ బెదకొండభూవరు
వరతనయుఁడు తిరుపతీంద్రకోవర్యునకున్ శ్రీ[9]
వరుఁడును నరుఁడును మరుఁడును
సరియగుదురు నీతిచాపకసౌందర్యములన్. 228

---

1. A B తద్వంశోద్భవుండు కుమారతిమ్మ ప్రభుండు But this would make Kumāra Timma a descendant of Gōpa of the preceding verse
2. V V C p 83, కుదురుగ నాశ్రయించి
3. V P Sastri, Cmm. i p 57 కొమార తిమ్మనిన్
4. V. V C p 83 గడియించు
5. B కరాశి
6. A B బెట్టిన, cf V P Sastri (Cmm i 57)
7. A లోకపాలిత. .భూషాయత, B లోకపాలిత...భూషాయత
8. A B. కల్గునే
9. ,, వరతనయ్యవశుం

వ. [ఆగనితిమ్మానాయని పరాక్రమం బెట్టి దనిన.][1] 229

సీ. చండరోషస్ఫూర్తి తొండమారయ గుర్ల
  కోట నిర్ఘాటధాటిఁ గూల్చి
నచ్యుతదేవరాయలు రాయమన్నీల
  బోజుఁ గితండని పొటుఁ[2] బొగడ నెగడె
గడిఁ దాఁటిరాకుండ వడిఁ దాఁకి మలకకా
  ల్బలముల నేల కాల్బలముఁ జేసె
నెఱదిమ్మఁ గొనసారి నెరదిమ్మ బిగఁ[3] బట్టి
  ఘటియించె గృధ్రకంకాలి[4] బ్రమోలఁ
దోలి తొప్పరలాడి చేఁబ్రోలి[5] తిమ్మ
నృపుని వధియించె నాబాలవృద్ధ మగను
సోమకులముఖ్య భార్గవరామభీమ
బిరుదములు మించఁ గనితిమ్మనరవరుఁడు. 230

సీ ఒకసారి కందవోలు హొన్నప్పనాయనిఁ
  జెండవె కుచ్చెల చేనిమేర
వీరయశాంతభూవిభునిఁ దోలాడవె
  తలఁకి పాఱంగ[6] నుద్దండవృత్తి
నన్నూరిరొద్ద నున్నతవిక్రమంబునఁ
  జాయని గెల్వవె జగము లెఱుఁగ
శాంతభూధవలింగజనపాలుఁ గొట్టవె
  రాణ మీఱఁగఁ గృష్ణరాయ లెఱుఁగఁ
జేఁబ్రోలి[7] తిమ్మయఁ జెండి చెండాడవె
  చెలు వొదఁగా మట్టచెఱువు నొద్ద

1 A, B తద్వంశోద్భవుండు. But this would suggest that గనితిమ్మ was a discendant of Tiiupatēndra of the preceding verse.

2. A బోటు B బోటి

3. A B బిగు

4. „ ఘుడ్పిచ్చ గ్రోధకంకాలి

5 „ చాబోలి

6. „ తరుప (వ) యినగు నుద్దండవృత్తి

7. „ చేబోలి

బయిరువఖానునిఁ । బాఱంగఁ దోలవె
పరఁగంగ నిదె రాంపి । చెరలయొద్ద
ఖానఖానుని హిత । ఖానుని మొదలుగాఁ
గొట్టి సప్తాంగముల్ । గొనవె జగతి
ఆంధ్రదేశాధీశు । లయిన మన్నలఁ బోర[1]
రాల్పవె[2] మల్లాపు । రంబు బయట
నీవు జయశాలివైన ని । న్నెదుర నెఱచి
సూరినాయనిసూరుఁడు । సురుఁగు టరుదె
చారుమీనాంక రేచర్ల । శాసనాంక
రాయభూపాలుతిమ్మ భూ । రమణుతిమ్మ 231

సీ. గాయగోవాళుఁడు । కదలి దండెత్తెనో
యెడమక న్నదరెనో । యిందువదన,
ఖడ్గనారాయణ । ఘనుఁడు కోపించెనో
తుమ్మి రొవ్వనివంకఁ[3] । దోయజాక్షి,
దానచింతామణి । తమకు వేయించెనో
గుండె జల్లనియెనే । కోమలాంగి,
పీశెపట్టుతలాట । విభుఁగు దా వెడలెనో
దబ్బాటు వెట్టెనే । తలిరుబోఁడి,
అంచుఁ దమకులసతులతో । ననుదినంబుఁ
గాని శకునంబులం దెల్పి[4] । కల్వరించి
దాఁగియుందురు కానల । దర్పమణఁగి
చిత్ర మిది గొమ్మ వెలుగోటి । చిన్నతిమ్మ 232

సీ. చెనసి యేదులఖాను । సేనలఁ గొట్టవే
వెనుక ముందయి గముల్ । విచ్చి పాఱ
నొరసి కందనవోలి । హొన్నప్పనాయని
మర్దించవే విఱుపు । మందు లిచ్చి

1. A B పోరి
2. A గడుగవె, B గడుసవె
3. A B రొవ్వనిపక్క
4. ,, శకునబలందించి

మఱియు[1] భిక్షావృత్తి ʃ ముక్తికాంతయు లింగ
జననాథుఁ గొట్టవె ʃ జగ మెఱుంగ
నాలంబులోనఁ జేఁʃబ్రోలితిమ్మయఁ జంపి
పంపవె దేవేంద్రుʃపట్టణమున
కెన్నఁ[2] జిత్రంబు లిటువంటి ʃ వెన్ని లేవు
ప్రజ్ఞతో నీవు సేసిన ʃ పౌరుషములు
గాయగోవాళ బల్లరʃగండ బిరుద
రాయభూపాలుతిమ్మభూʃరమణుతిమ్మ 233

సీ. ఎనరేఁగి[3] రిపుల భూ ʃ మేలనీయవుగాని[4]
యింద్రుపట్టణము వాʃరింపలేవు[5]
ఒదిఁగి రాజుల నీడ ʃ నుండనీయవుగాని
మందారముల[6]నీడ ʃ మాన్పలేవు
సింహాసనము వైరిఁ ʃ జేరనీయవుగాని
చింతామణుల గద్దెఁ[7] ʃ జెఱుపలేవు
అరుల నెచ్చెలులఁ గూʃడాడ[8]నీయవుగాని
యల రంభతోడిపొం ʃ దాఁప[9]లేవు
ఇడుమలకు మాఱు సంపద ʃ లినుమడయ్యె
నీడ వలదన్న స్వర్గాని ʃ కేగవలసె[10]
గాయగోవాళ గండరʃగండబిరుద
రాయభూపాలుతిమ్మభూʃరమణుతిమ్మ. 234

---

1. A B మెఱసి
2. ,, అన్న
3. ,, ఎనరేగి
4 ,, నీయడు. The next three lines end similarly
5 ,, వేరింపలేదు
6 ,, మందానిలము
7 A గంద , B గంటె
8 A అరులనిచ్చెరులగూడెడ , B అరులనిచ్చెలులగూడెడ
9. ,, అనువలేదు
10 A యిదుగోవారికి మప్పుదోగియనుమడయ్యె , యీడ వలసైన స్వర్గానికేడవలను B యిదుగోవారికి పుప్పుదోగియను మడయ్యె

మెఱయు రాహుత్తుల మెదడు గండపుఁబూఁత
మత్తారిరాజచర్మంబు కాసె
సమదారిమాంసఖండములు పువ్వులదండ[1]
విమలభూపతి జడ వీరగోల
ఘనరక్తభీకరాకార మావేశంబు
బెడిదంపుదాఁటులు పెద్దసివము
నాహవాటోపనిర్హ్రాదంబు బొబ్బలు
మెఱుఁగైన చాయలు మిట్టగుడ్లు[3]
కదనమున మన్నెపోతుల గాఁపుపట్టి[4]
పోరఁ జరియించు నీఖడ్గపోతురాజు[5]
గాయగోవాళ బల్లరగండబిరుద
రాయభూపాలుతిమ్మభూరమణుతిమ్మ. 235

6. పొలుపొందు తలకాయపూజె కుండలు[6] సూచి
ప్రధిత విద్వేషుల[7] ప్రభలు సూచి
కర మరిఖడ్గాళి కిడిఁదిరేటులు[8] సూచి
వెలుపైన[9] రణరంగవేది సూచి
మేలిమి నెసఁగిన[10] మెదడు గండము సూచి
శత్రురక్తంపుటక్షతలు[11] సూచి
భీకరజయఘోష పెండ్లికూఁతురుఁ జూచి
పెంపొందు మత్తారిపీఁటఁ జూచి

1 V V C p 85, A సముగారిమోమున ఖండములపూలదండ
B సముదారిమాముున ఖండములపూలదండ
2. A B కారమాకారంబు
3 ,, సంహారంబు. మిట్టగుండ్లు
4 B గామబట్టి
5. V.V C p 85, A B ,పోతురాజు
6 A B భూచిగుండేలు
7. A B విగ్వేషిత
8 A ఖడ్గాగ్రకత్తిమొత్తులు, B ఖడ్గాదికత్తిపేతలు
9. A B వెడువైన
10 ,, నొసగిన
11 ,, యయుల రక్తప్రదక్షతలు

పేరెములు వా ఊ సీఖడ్గ ఽ పెండ్లికొడుకు
అహాహా! రేచర్లసింహాఽసనాధినాథ
గాయగోవాళ బల్లర ఽ గండబిరుద
రాయభూపాలుతిమ్మభూఽరమణుతిమ్మ. 236

సీ. పగతుల నెత్తురుఽపైనూనెఁ బట్టించి
ఘనత సత్కీర్తియఽ కాసెఁ గట్టి[1]
మొనసిన వైరుల ఽ మొగసాలఁ దానాడి[2]
యుదిరిన దిక్కులఽయురువుఁ జూచి[3]
యహితభూపతులపై ఽ నారంగములు[4] గాని
తిపురు[5] భూపతులపై ఽ తిరుపుగట్టి[6]
కొసరు మన్నీలపైఁ ఽ గోలల[7] వెసనాటి
చెలఁగు[8] భూవరులపైఁ ఽ జింప లాడి
వారి సప్తాంగములు చాగఽ[9] వహులు గొనిరె
నిట్టి సీఖడ్గపుత్రికి ఽ సీడు గలరె
గాయగోవాళ బల్లరఽగండబిరుద
రాయభూపాలుతిమ్మభూఽరమణుతిమ్మ. 237

సీ. కదనవారాశి రఽక్తమున స్నానము చేసి
వైరి[10] చర్మంబు దోఽవతిగఁ గట్టి
సమదారి[11] ప్రేవులు ఽ జన్నిదంబులు వేసి
తగవైరి మెదడు చంఽదనము[12] దీర్చి

---

1 A ఘనతసత్కీర్తియుగాఁగ, B సత్కీర్తియుగాఁగ.
2 A B మొనసినవైరుల మొగచాలి గానాడి
3 ,, వురువుచూచి
4 B భూపతులై సారంగములు
5 A తిరిరిభూపతులపై, తిమ్మభూపతులపై
6. A తివురు, B తివుర
7. A B కోవల
8 ,, చలగు
9 ,, త్యాగవహులు
10. ,, విమత
11. ,, సమరవైరి
12. ,, మెదడుగోపిచందనము

యొరసిన రౌద్రంబు । హోమకుండము సేసి
　　　　తలచైన నరములు। దర్భ చేసి
విమతుల దంతముల్। వెల్లక్షతలు[1] చేసి
　　　　క్రొవ్వును గఱఁగించి । ఘృతము చేసి[2]
సొబగుతో[8] వేల్చు నీఖడ్గ। సోమయాజి
యహహా! రేచర్ల సింహాసనా।నాధినాధ
గాయగోవాళ బల్లర । గండబిరుద
రాయభూపాలుతిమ్మ।భూ।రమణుతిమ్మ 238

సీ నీవు పుట్టినవేళ [। నీ*] శత్రువరులకు[3]
　　　　దిగు లెత్తి [మఱి] పుట్టు[4] । దినము తాఁగ్రొ
నీ వాకించుక[5] నగ । నేర్చినఁ బగవారి
　　　　బ్రదుకు లెల్లను నగు।బాటు లాయెఁ
గ్రమముగ నీవు వి।ద్దెము సేయనేర్చిన[6]
　　　　విద్దెల[7]వా రైరి । విమతవరులు
ప్రభుశిఖామణి నీవు । పరువాఱ నేర్చినఁ
　　　　బరువు లెత్తిరి పర।బంధు లెల్ల
హయము నీ వెక్కనేర్చిన । నహితవరులు[8]
కొండ లెక్కిరి తమయిండ్ల । నుండ వెఱచి
రూఢి నీ వాదిగ శ్రీశ్వ।రుఁడవుగాను
దాయభూపాలుతిమ్మ।భూ।రమణుతిమ్మ. 239

---

1 A. B వెల్మక్షతలు
2. ,, 'క్రొవ్వుగరగించటు క్రముతముచేసి.' 'క్రొవ్వ' 'ఘృతము' అనుచోట 'ఘృ'ను 'క్రు' గా బవి భ్రమచే గ్రహించి 'క్రొ' 'ఘృ' లకు యతి మైత్రిగల్గించెను ఇట్టి ప్రయోగములు 'నవనాథ చరిత్రము', 'భాస్కరరామాయణము' మొదలగు గ్రంథములయందు గానవచ్చుచున్నవి.
3. B శత్రువీరులు
4. A B పుట్టిన
5 ,, నీవువకించుక
6. ,, క్రమవిగాద నీవు విద్యముశాయ నేర్చిన
7 ,, విద్యల
8. ,, నీవు గాయు మెక్క నేర్చిన యుహితవరులు

మ. ఘనతన్ బర్వతకందరస్థలములన్[1] గాల్చిల్పి[2] పైకొన్నచోఁ
గిరులన్ గన్నడరాజఘోటమృగకంఠీక్తిన్ గూల్చె నుద్వృత్తిమైఁ
జెనకెన్ మత్తమతంగజప్రభు నదల్చెన్ రాచుతే నేపునన్[3]
గనితిమ్మక్షితిపాలసింహులఁ బొగడంగాఁ బోలదే[4] యెరికిన్. 240

సీ. కల్పవృక్షంబులు గణుతింపఁ బడెఁ జెట్లు[5]
వడిఁ గామధేనువు వట్టిసావు[6]
తుది నప్పావడి గాలిఁ[7] దూలె నామీఘుండు
రమణఁ జింతామణి రాతిగుండు[8]
పాతాళగతుఁ డయ్యె బలిచక్రవర్తి దా
భాపింపఁ జాగ్రుఁడు పక్షపాతి
యర్కనందనుఁడు దానరయ దరిద్రుండు[9]
శిబిమేని మాంసంబు చెప్ప రోఁత
యిట్టి దాతలవితరణ లేల చెప్ప[10]
నిన్నుఁ గొనియాడఁ దగుఁ గాని చేర్పుతోడ
నర్థి దారిద్ర్యతిమిర దోషాపహరణ
దినకరాటోప[11] వెలుగోటి తిమ్మభూప 241

ఉ. గోపతితుల్యభోగ వెలుగోటపురీంద్రకుమారతిమ్మ [సీ]
రూపము విక్రమాంకు[12] నిజరూపముగాక మనుష్యరూపమే
యూపలు కట్ల, కాసివిధమైన మనుష్యుల కేల గల్గుఁ [గ్రే]
చూపుల రాజ్యలక్ష్మి యరిఁ జూచిన[13] చూపుల వీరలక్ష్మియున్. 242

---

1. A. కంధరస్థలమున్ , B కంధరస్థలిని
2 A B గాల్చిల్చి
3. ,, చామశేయేపునన్
4 ,, పొగండబోలఁడే
5. ,, బడిశెట్లు
6. ,, ఒగికామదేనువు వొర్యగురుపా
7. ,, గాని
8. ,, గుండె
9 ,, ద్యార్క దారిద్రుడు
10. ,, వితరణుడేమిచెప్ప
11 ,, ధీరతాటోప
12 ,, విక్రమార్క
13. ,, వీరలక్ష్మి నలిగిచూచిన

శా. శ్రీమత్కాంతిఁ గృపం బ్రతాపమున వాక్శ్రీధీవిలాసంబునన్[1]
సామర్థ్యంబున భాగ్యసంపదలఁ జంచద్బాహుగర్వంబునన్
సోమున్ రాము రవిన్ గవిన్ మురహరుం సుత్రామునిన్ ధేనున్
... ... ... ...[2] 243

క. మొక్కని రాజులు నీచేఁ
జిక్కని మన్నీలు సేవ సేయని దొరలున్
లెక్కించి చూత మేరీ
దిక్కులలో రాయవిభుని తిమ్మయ తిమ్మా. 244

వ. అల గనితిమ్మభూభుజునకు వేదత్రయ శిఖత్రయ రామత్రయంబు లనందగిన కుమారులు పెదతిరుమలవిభుండు నాయనేంద్రుండు తిమ్మక్షమాణియుఁ[3] గల్గిరి[4]. అం దగ్రజుండు. 245

చ. వినువక పెద్దతిమ్మపృథివీధవుచేతి[5] పయోధరంపు వి
ల్లడరు గుణస్వనంబులురుమై[6] జడిమై శరవృష్టు లీనఁగన్
జడిసి నభోధ్వగాము లయి చయ్యన శాత్రవరాజహంసముల్
కడువడి నేగుదెంచె వనికా[7] వనజాకరతీరభూమికిన్. 246

వ. ఆనల్లగండ్లనాయని[8] సహోదరుండు. 247

సీ. తగువారిలోఁ జౌకోదనము గాంచిన వార్థి
యింద్రుచేఁ దూలిన హిమనగంబు
పురహరాలోకనంబునఁ గ్రాఁగిన మరుండు
పగటికైనను[9] లేని భానుసుతుఁడు

---

1. A, B. వాచీక్రధీవిలాసంబునన్
2. A line is missing.
3. ,, తిమ్మధీమణి
4. ,, గల్గెనందగ్రజుండు
5. ,, చేత
6. ,, A. తెల్లడరు...వరమ్మె; B. వెల్లడరు...వరమ్మె
7. ,, డేరవనికా
8. According to the prose passage above, the name ought to be Peda Tirumala. Nallagandla Nāyadu is probably an alias of the same chief.
9. A. 'పగలింటికిని'

సడుగు పేదతికంబు ఽ వడసిన కరివైరి
పీచివాఱైపాఱు ఽ వేల్పు టేఱు
చిట్టాడి మడుఁగుఁ జొచ్చిన నాగకేతుండు
పలలాశిచేఁ బట్టు ఽ వడిన వజ్రి
తనదు గాంభీర్యధైర్యసౌందర్యదాన
శౌర్యకీర్త్యభిమానని ఽ స్తంద్రభోగ
ములకుఁ దులయె నా[1] భూమిని ఽ బొగడ నెగడె
నాయనేంద్రుండు సౌఖ్యసంధాయకుండు.[2] 248

సీ. పటహభేరీఢక్కా ఽ భాంకృతి ధ్వనులచేఁ
జగతురగుండెలు ఽ పగులువాఱు
హయఖుర ఘట్టనోద్ధతరేణురాగంబు
గగనభాగం బెల్లఁ ఽ గప్పికొనును[3]
బలపరాక్రమవీర ఽ భటరాహుతులచేతఁ
దోరంపు టడవి తుత్తుమురు లగును[4]
కరిఘటాప్రకటసంఘటిత ఘీంకరణముచేఁ
కుంభికుంభీంద్రముల్ ఽ గొణఁగు పడును
నీవు రణరంగభూమిలో ఽ నిలిచినపుడు
గాయగోవాళ ఖడ్గనారాయణాంక
భాగ్యచారిత్ర, తిమ్మభూపాలపుత్ర
నయహరిశ్చంద్ర, వెలుగోటి ఽ నాయనేంద్ర. 249

సీ. నిచ్చకల్యాణంబుఁ ఽ బచ్చతోరణమును
గలిగెఁబో నిర్జర ఽ కామినులకు
సర్వకాలంబును[5] ఽ సరిలేనిసంక్రాంతి
బోగియు గలిగెఁబో ఽ భూతములకు

1. A. B సౌర్యకీర్తియభిమాన నిస్తంద్రభోగములకు దులయన
2. ,, సంధాయనుండు
3 ,, కొనగ
4. ,, తుత్తుమురుగాగ
5. ,, సార్వకాలంబును

లేములు[1] విడిచి చ | ల్దియు వేఁడియును నిండ
సమకూడెఁ బో మృగ | జాతి కెల్ల
నవత లన్నియుమాని | భువిచారములచేత[2]
వింతమై యొప్పెఁ బో | విహంగకులము
ఆహవంబున నాగార్జు | నాద్రిపైటఁ
గొసరి[3] జయలక్ష్మి నిన్నుఁ జే | కూడినపుడు
సోమకులరాజవర్గని | ర్ధూమధామ
నాయకోపేంద్ర వెలుగోటి | నాయనేంద్ర. 250

సీ. పరశురాముఁడు రాజ | పటలంబు ననిలోనఁ
జదిపిన[4]నాఁటి మాం | సంబురుచులు
కినిసి రాముఁడు దశ | గ్రీవాదిదైత్యులఁ
దునియించు[5] నాఁటి నె | త్తురులరుచులు
కవ్వడి గాంగేయ | ఘనయోధముఖ్యులఁ
జంపిననాఁటి మ | జ్జ[6]పురుచులు
వాసవుఁ డుగ్రజం | భాసుర[7] ప్రముఖులఁ
దునిమిననాఁటిమే | దోరసంబు[8]

... .. ... ...

నాయకాధీశు వెలుగోటి | నాయనేంద్రుఁ
జేరి యనిలోనఁ జిరకాల[10] | జీవులైన
భూతములు సాక్షిదశదిశా | భూమాలంక 251

---

1 B వేములు
2. A B. చవిచారముల
3 ,, మరియునాగార్జునాద్రిపైటకడగి
4. A రాజ్యపటలంబు బొరిగొన్న
5 A B సమయించు
6 ,, మజ్యంపు
7 ,, వాసవుదుగ్రాజి భాసుర
8 ,, మేదురరసంబు
9 A line is missing
10. ,, చరితమాలోన స్థిరకాలజీవులై

సీ. పద్మనాయకు లైన ౯ బాంధవు లొకవంక
నుత్తమక్షత్రియు ౯ లొక్కవంక
దండనాధులు[1] మేటి ౯ దళవాయు లొకవంక
నుభయప్రధానుఁ ౯ నొక్కవంకఁ
గవులు విద్వాంసులు ౯ గణితజ్ఞు లొకవంక
[నుర్విపతులదూత ౯ లొక్కవంక][2]
భటనటగాయక ౯ భామిను లొకవంక
నుచితజ్ఞులగువైద్యు ౯ లొక్కవంకఁ
ప్రభులుఁ బరివారములు మిమ్ము ౯ బలసికొలువ[3]
మహిని శోభిల్లు నాస్థాన ౯ మంటపంబు[4]
విమలచారిత్ర తిమ్మభూ౯విభుసుపుత్ర
నయహరిశ్చంద్ర వెలుగోటి ౯ నాయకేంద్ర 252

మ అరయ౯ దిమ్మయనాయకేంద్రుఁడు భుజా ౯ యత్తాసిచేఁ గార్యభా
సురపారాభవభాద్రశుద్ధవితి ౯ సోమాఖ్యవారాన డ[5]
గ్గరి నాగార్జుని కొండయొద్ద రిపుల౯ ౯ ఖండించె నాఖండలే
శ్వరనాగేశ్వరలింగభూవినుతకృ౯ష్ణావాహినుల్ సాక్షిగ౯ 253

చ అలవునఁ దాళజంఘులను ౯ హైహయుల౯ ద్రుపదేంద్రుపుత్రుని౯[6]
దొలి సగరుండు భార్గవుఁడు ౯ ద్రోణతనూజుఁడు ద్రుంచినట్లు వి
హ్వలముగ సోమవంశజుని ౯ యావడి రోబళరాజు నాజిలో
నలిగి[7] వధించెఁ దండ్రిపగ౯ కై భళి మా వెలుగోటి నాయఁడు౯ 254

క. ఆవడి రోబ[8]నృపాలుని
నావడి నేనాయనయ్య ౯ యసిధారఁ దెగం

---

1. A B దండనాయక
2 The Mss repeat here the second part of the previous line
3. This line is not found in B
4 A B. నీయాస్థాన మంటపమున
5. ,, కార్యభానురుం డైపరాభవ సంవత్సర భాద్రపదాదిశుద్ధచవితి౯ సోమవార మంచాజిద, 'సురపారాభవభాద్రశుద్ధచతుర్థి గ సోమాఖ్యవారంబున౯ । ధర అనియు సవరించవచ్చును ఇందర్థి' తెల్పుపలుకవలయును
6. ,, పుత్రుఁడు౯
7. ,, తొడరి
8. ,, వోటు

గా వడిన రంభ చైకొనె
యావడి సేయంగ దివిజు ౯ లక్కడ బెదరన్[1] 255

క. సోమకులపరశురామా
ద్దామమహాబిరుదమునకుఁ ౯ దాతలకంటెం
బ్రేమమున వన్నెఁ దెచ్చును[2]
సీమహి వెలుగోటినాయ ౯ సేంద్రుఁడు దలఁపన్.[3] 256

వ. అతని యనుజుండు 257

సీ. ఆజీము ఖాను[4] వెన్నాడి పోఁడిమి బిట్ట
దర మట్టితివి[5] పాండ్య ౯ దళవిభాళ
కలనిలోన యఖూప ౯ ఖానుఁ బోఁ దోలవె
పరువెత్తఁ బ్రతిగండ ౯ భైరవాంక
కుదియించి యలచింత ౯ గుంటధర్మారావు
నడఁచవె[6] రాయవే ౯ శ్యాభుజంగ
బతి[7] మాలఁ జేసి భూపతిరావునాగనిఁ
గావవె[8] రణలయ ౯ కాలరుద్ర
చండించి దేవరకొండ రాణీలను
మర్దించవే[9] చలమర్తిగండ

1 A దివిజులక్కడబెదరిరీ, B. దివిజులక్కడజేరిరీ
2 B దెచుజ
3 A. B. ధాత్రిజ
4 ,, అజీముఖాన, V V C p 86 అజీజిజ్ఞాఖాను
5 A పోడిమిపెట్టదరమెట్టి, B పోడిమిపెంటదరమెట్టి
6 A B నడచెద
7. B లతి
8. B కాలవె
9. A B ధాణీలతలలు మొత్తించవే

మల్కిభరాము[1] భూ | మండలేశ్వరునిఁ జెం
డాడవె యవనకోలాహలాంక
మునుపుగా ముస్తఫా[2] | ఖానుఁ బోఁ దోలవె[3]
దండితో దానచింతామణీశ
ఘాటిచేఁ జిట్టెల | కోట మట్టించవె
యెలమితో మన్నెభ | ద్రేభమూర్తి
ధరయెల్ల నెఱుఁగంగ | దస్తురఖానునిఁ
జెండవె గండర | గండబిరుద
పశుగణంబులఁ గొల్ల | పట్టించవే శౌర్య
వైఖరి గాయగో | వాళబిరుద
ముగురురాజులు మెచ్చ | మగఁటిమిఁ జూపవె
గడిదుర్గమునఁ బరా | క్రమమృగేంద్ర
నీప్రతాపంబు మహిని వర్ణింప వశమె
సర్వబిరుదులకొమరవే | శ్యాభుజంగ
భళిర! వెలుగోటితిమ్మభూ | పతికుమార
మతిఫణీశ కుమారతి | మ్మక్షితీశ 258

సీ. సిరులిచ్చి[4] కర్ణాట | సింహాసనాధ్యక్షుఁ
డాదరింపఁగ నెవ్వఁ | డతిశయిల్లె
విఱిగినయని నుండు | కెఱుఁగఁ డెవ్వఁడు కల
నైన నేమఱుపాటు | తోననైనఁ[5]
దురకమూఁకలఁ బాఱఁ | దోలె నెవ్వఁడు మహో
గ్రాటోపమునఁ గొండ | వీటియొద్దఁ
దను భజించిన బంధు | తతి నెల్లఁ దనయంత
వారిఁగా నెవ్వఁడు | ధరణిఁ బెనిచె

---

1 B మల్కిభూరాము
2. A B ముస్తాఫ
3. ,, పాఱగదగవె
4 ,, సిరులిచ్చు
5. ,, తోడనైన

నతఁడు బల్లరగండ కే | శాదిరాయ
గాయగోవాళ గండర | గండ చండ
సర్వబిరుదుల కౌమరవే | శ్యాభుజంగ
బిరుదభరితుండు చినతిమ్మ | నరవరుండు. 259

సీ. తననేత్రనీరజ | ద్వయము సంపద లిచ్చు
నిగురుఁబోఁడికిఁ బుట్టి | నిల్లు గాఁగఁ
తనయశఃకందుకం | బానరు మాటమిటారి
యుబ్బుచన్గవకుఁ బె|న్నుద్ది గాఁగఁ
తనముద్దుమోము కాం|తాదృక్చకోరదం
పతులకు నెఱ చంద|మామ గాఁగఁ
తనప్రతాపాగ్ని కం|దర్పదర్పధ్వంసి
చుఱుకఁ గంటికిని నీడు | జోడు గాఁగఁ

వెలసె నెవ్వాఁడు మధుమదా | వృతతురుష్క-
వర్మ్మర క్తరసచ్ఛటా | వర్ధమాన
భంగసంఘాత[1] కృష్ణాత | రంగిణీశుఁ
డధిపమాత్రుండె పిన్నతి|మ్మవనివిభుఁడు. 260

సీ. శ్రీకరంబుగ నీవు | చిట్టేలఁ గైకొన్న
దేవరకొండకు | దివులు పుట్టె
భీకరంబుగ నీవు | పేరూరుఁ గైకొన్న
నానల్లగొండ శౌ|ర్యం బణంగె
దేవులపల్లీవు | రివితోఁ గైకొన్న
నరవపల్లెకు జయం | బల్లఁదోలఁగె[2]
నాగులపాడీవు[3] | వేగమె కైకొన్నఁ
దూలుంద్రగొండ[4] గ|గ్గోలువడియె[5]

---

1 A B గాధిసాధూత
2 ,, జయంబెల్లదోలగె
3. ,, నాగులపాడునీవు
4. ,, తూలిపుంఢ్రగొండ
5. ,, పడును

వాడపలి నీవు గైకొని ƒ వఱలువేళ
గడమ దుర్గంబు లన్నియుఁ ƒ గలుపరించె
నెన్న వెలుగోటితిమ్మయ ƒ చిన్నతిమ్మ
మహి మహేంద్ర కుమారతిƒమ్మక్షితీంద్ర. 261

సీ. రామరా జెఱదిమ్మ ƒ భూమీశుపంపున
మలఁజొచ్చి బోయల ƒ బెళుకుఁ దీర్చె[1]
ముస్తఫా ఖానుని ƒ ముస్తీదుఁ[2] జెడఁ దోలి
భద్రగజంబులఁ ƒ బట్టి తెచ్చె[3]
మొనసి దేవరకొండ ƒ మూఁకలు వచ్చిన
ఘోరాజి శిరములఁ ƒ గొట్టివేసెఁ[4]
జలపట్టి[5] యిభరాముƒ శాహు పంపుల నెల్ల
ధరఁ గృష్ణసాక్షిగాఁ ƒ దఱిమి గెల్చె[6]
నిట్టి విజయంబు లెన్నితే ƒ వెన్నిచూడ
రాజమాత్రుండె వెలుగోటి ƒ రాయపేంద్రు
తిమ్మఘను చిన్నతిమ్మధా ƒ త్రీశసుతుఁడు
మహితయశుఁడు కుమారతిƒమ్మప్రభుండు. 262

మ. అళిరామ ప్పెఱ[7] దిమ్మరాజమణియు ƒ న్నా వేంకటక్ష్మాపుఁడుం[8]
సెల వన్నంతనె యేఱు దాఁటి గడెలోఁ ƒ జిట్టేల పేరూరు దే

1. A B బెరకుదీర్చి
2 ,, ముస్తీబు
3 ,, తెచ్చి
4 ,, వేసి
5 ,, చనకి
6 ,, గెల్చి
7. A హరిరామప్పర
8. A, B క్ష్మాపతిఁ

వులప ల్నాగులపాదు వాడపలియు న్నువ్వొత్తుగాఁ[1] జేకొనన్
భళి! వెల్గోటికుమారతిమ్మఁడు ధరా భర్తల్ భయం బొందఁగాన్. 263

మ. రఘురాముం డెఆదిమ్మరా జనుపఁగా రంజిల్లహన్మంతుఁడై[2]
ఖగరాజై వెలుగోటితిమ్మఘనుఁడే గాంభీర్యశౌర్యంబులన్
బగవారిం దెగటార్చి రాజహితుఁడై బాసిల్లె నెల్లప్పుడున్
దగు నారాజుకు మన్నెశేఖరునకున్ దద్దైవఖడ్గిన్ బోల్పఁగన్. 264

చ. తివిరి నితాంతకుంతమునఁ దిమ్మయతిమ్మవిభుండు గ్రుమ్మినన్
యవనులు నేలఁ గూలు సమయంబున నాలుక సాఁచి తత్తను
స్రవదరుణంబుఁ గ్రోలి పెలుచన్ దిశ లల్లలనాడఁ ద్రేఁచు[3] భీ
మవిధిని గొండవీటికడ మండలదీవిని భూతజాలముల్. 265

వ. అతని కుమారుండు. 266

సీ. తన జనార్దననామమునకు భూషణముగా
జనులఁ బోషించు నాసక్తిఁ దొడరి
భూపతిత్వము దాల్చి భువనమోహనమైన
సౌందర్య[4]విభ్రమచ్ఛాయఁ బ్రబలి
బంధుమిత్రామాత్య సంధానసౌభాగ్య
పరమసంపత్కరప్రౌఢిఁ దనరి
సింహాసనమున విచిత్రకారణముగా
సకలపాండిత్యంబు సంగ్రహించి
పూని రేచర్లకులవార్ధి పూర్ణచంద్రుఁ
డనఁగ మారకపురిచెన్నుఁ డవతరించె
వేడ్క వెలుగోటిగనితిమ్మ విభుకుమార
తిమ్మయప్రభుచెన్న పృథ్వీశ్వరుండు. 267

1. A. B. ఉచ్చారణ సామ్యమువలన భ్రమపడి కవి 'వు' 'ఊ' లకు యతి మైత్రికల్పించి యుండవచ్చును.
2. ,, రఘురాముం డెరదిమ్మరాజు వద్దన్ రంజిల్లు హనుమంతుడై.
ఇందు వర్గప్రాసముపయుక్తము.
3. B. ద్రెచ్చు
4. A. B. సౌందర్య

వ. అతని యనుజుండు 268

ఉ. సంతతదానకర్ణుఁడు లసద్గుణపూర్ణుఁడు రూపరేఖకా
కంతుఁడు సర్వభూమిధవ కాంతుఁడు మారుతవేగవాజరే
వంతుఁడు నిర్వితర్క[1]బలవంతుఁడు మత్తగజాధిరోహణా[2]
క్రాంతుఁడు తిమ్మభూవిభుఁడు చక్రిసమానుఁడు రాజమాత్రుఁడే. 269

క. అల గనితిమ్మధరిత్రీ
తలనాథలలాము కూర్మి తమ్ముఁడు కరుణా
జలధి [3]పినకొండనరపతి
వెలయుఁ సకలార్థినిలయు విబుధద్రుమమై 270

సీ. హరివీరవరలంఘ నావమానంబున
గారవం బెడలని కంధిరాజు
జంభారిదంభోళి సారధారాహతిఁ
బతుముల్ గోల్పోని భర్మశిఖరి
పృథ్వీమరుజ్జయాపేక్షఁ 'గుంజర' యంచు[4]
బొంకు బొంకని ధర్మపుత్రకుండు
రాధేయుదృఢబాణబాధ పీటికి[5] భీతి
నొంది పాఱని శక్రనందనుండు
సాటి సవతు సద్వృత్తుంబు సన్నిభంబు
వితతగాంభీర్యధైర్యసూనృతపరాక్ర
మముల వెలుగోటిపినకొండమనుజనాథ
మకుటమాణిక్యమునకు భూమండలమున. 271

[6] *సీ. గంభీరమగు నంబు గర్భంబున ఘటిల్లి
కూర్మాసనంబుపైఁ గుదురు కొనియుఁ

---

1 A B నిర్వితర్క్య
2 ,, రోహణ
3. ,, జలనిధి
4. A మంత, B కుంత
5 A. భూదాపీథికి, B బాధవీథికి
6 The verses marked with * have been extracted by the compilers of this chronicle from the Bhānumatī pariṇayam of Renṭūri Rangarāju

దీక్షమైన వరాహ దేవదంష్ట్రాంకుర
సూచికాగ్రంబున సొంపు గనియు
ఘోరమైన యనంతకుండలి భోగ[1]ప్ర
దీప్తభాగంబునఁ దేజరిలియుఁ
గఠినంబులైన దిగ్గజమహా[2]శైలేంద్ర
వికటరూపంబుల విరివి గొనియు

ధీరత వసుమాచరించి ధాత్రీవధూటి
నిల్చె వెలుగోటిపినకొండ నృపశశాంకు
సంకుమదపంకసంకీర్ణ కుంకుమాంబు[3]
మిళితకేయూరమణిభుజాగ్రమునందు. 272

మ. అల ధీరుండగు పిన్నకొండపకు రమ్యాకార తిమ్మాంబ ని
ర్మలధర్మోజ్జ్వల[4] యక్కమాంబ తరుణీరత్నంబు పింగాంబయున్
గల రంచత్కరుణా[5]కమాపతిహితైక శ్రీల శ్రీ[6] భామిని
కలచందంబున నాత్మభర్తకు మనోల్లాసంబుఁ గల్పించుచున్. 273

శా. ఆతిమ్మాంబకుమారకుల్ మెఱసి రత్యాశ్చర్యమార్తాండలీ
లాతేజుండు కుమారతిమ్మపయు హేలావారకాంతామణీ[7]
చేతోజాతుఁడు కోనధీరుఁడు బుధశ్రేణీనుతాఖ్యాతి[8]వి
ఖ్యాతుండౌ పెదకొండశౌరి సుబలుం[9]డౌ రాయభూపాలుఁడున్ 274

శా. అక్కాంబామణి కాంచె రంగవిభు నేచాధీశుఁ దిమ్మక్షమా
భుక్కోటీరుని, సింగమాంబ మదనాభున్[10] బెద్దతిమ్మప్రభున్

1. A B యోగ
2. B P హేమ
3 A B కుంకుమంబు
4 B P ధర్మాఖ్యల
5 A B గలరంచత్కరుణ
6. ,, శ్రీ
7. ,, కుమారతిమ్మనృపుఁడేలాగంధచూడామణీ
8. ,, ఖ్యాత, B P. ఖ్యాతి
9. ,, సులభుండు
10 ,, మదనాభున్

దిక్కోటీయుతసాంద్రచంద్రరుచికీర్తిన్ బిన్నతిమ్మప్రభున్
వాక్కాంతాపతిఁ[1] గాండధీయుఁ గనియెన్ వారాశిగంభీరునిన్. 275

వ తత్కుమారవర్గంబునం దగ్రజుండు. 276

సీ. తనువాసనాధైర్య ధర్మాణిమానులఁ
గాంచనాచలధర్మ కలనవాఁడు
మతిభోగ[2]శక్తిసంతతవిష్ణుభక్తుల
శారదేంద్ర[3]కుమార సరణివాఁడు
నతపోషణారూప నయశౌర్యరేఖల
హారిభావభవగురు స్ఫురణవాఁడు
బలశౌభ్రి[4]దానకృపావిశేషంబుల
రామచంద్రఘనాభి రతులవాఁడు
నిహతసామంతసీమంతి సీనితాంత
తాంతహృదయాంత కాంతసంతాపదశది
శాంతవిశ్రాంతకీర్తిల కాంతకుంత
కాంతుఁడు కుమారతిమ్మభూకాంతుఁ డలరు 277

సీ. సంతతసత్యభాషణము లాతనిసొమ్ము
లతివేలతరధర్మ మతనిసొమ్ము
భవ్యప్రసాదసౌభాగ్య మాతనిసొమ్ము
ఆశ్రితావనఫల మతనిసొమ్ము[5]
దానవాహితపదధ్యాన మాతనిసొమ్ము
మితిలేని సంపద లతనిసొమ్ము
వలరాజుఁ బురుడించు చెలువ మాతనిసొమ్ము
ఆహవకౌశల మతనిసొమ్ము

---

1. A B వాక్కాంతామతి
2 ,, మరిభాగ
3 ,, శారదేందు
4 ,, శౌర్య, 'శౌచ' అనియుం బఠింపవచ్చును
5 ,, ఆశ్రితానఖలమతనిసొమ్ము

యన్వయోచితసంవృత్తి ॥ యతనిసొమ్ము
అఖిలవృద్ధోపసేవ[1]నం ॥ బతనిసొమ్ము
అనుచు లోకులు వినుతింప ॥ ఘనత కెక్కె
సుప్రభుండు కుమారతిమ్మప్రభుండు. 278

క ఆనయసీరధియనుజుఁడు
కోనయ శాత్రవులఁ దృణముఁ ॥ గొటికింపఁగఁ[2] ఖా
ఛైన యవసంబు[3] దన్మహి
శానయనాంబువులఁ బశువుగలకుఁ గాఁ బెరుఁగున్. 279

చ తదనుజుఁ బెద్దకొండవసుధావరు మాన్యుని త్రెవ్వి[4] నెవ్వడిన్
ద్రిదశపురంబుఁ జొచ్చిన యరిక్షితిపాలురనెత్తు రుత్పత
త్పదనఖలాక్షలై కటికిఁ ॥ బావడలై వలిగుబ్బదోయికిన్
గదురు జవాదులై రతి నొకానొక చెల్వొడఁ గూర్చు రంభకున్.[5] 280

ఉ. ఇమ్ములఁ బెద్దకొండధరణీశ్వరచంద్రుఁడు దాడివోవుచోఁ
గమ్మలు వ్రాయ సర్వకటకంబుల కాఁపులు దారిఁ బాతిలో
కమ్మలు బోయమూఁక లనఁగా నిలు పోపక పోదు రానినన్
గుమ్ములు పోవు లోక మెఱుఁగున్ దదుపార్జితహేతిధారలన్[6] 281

సీ. మాంసల[7] ప్రతిపక్ష ॥ మండలేశ్వరమహా
న్నతకంధరంబుల ॥ నటికి నటికి
వికటాభియాతి పృథ్వీనాథఘనవిగ్ర
హోరుచర్మంబుల ॥ నొలిచి యొలిచి[8]

---

1 A B వృద్ధావసేవ
2. „ గొరికింపంగాఖా
3 „ యవసరంబు
4. „ త్రెల్వి
5 „ రతినాకానాకచల్వడగూర్చురంభకున్
6 „ కమ్మలు పోయి సర్వకటుకంబులకొ ఘనుదాకి పారి లో
కమ్ములు బోయమూకలనగా నిలుపోపకపోదురానినన్
కమ్మలు పోవులోక మెరుగున్ తదుపార్జితధారాలికిన్
7 „ మాంసల
8 A వికటాభియతపృథ్వినాయక విగ్రహఘనహోరుచర్మంబులు వొలిచి వొలిచి
B .. హేమ

ఖలవైరి[1] ధారుణీ తలనాథమృదులాంగ
తతులను[2] జక్కఁగాఁ దఱిగి తఱిగి
ముష్కరారాతిమ స్తిష్కాస్థికర్పర
కోటిఁ దుత్తుమురుగాఁ[3] గొట్టి కొట్టి
రూఢి నీఖడ్గసూపకారుఁడు రణోర్వి
వివిధభూతావళికి విందు వెట్టు నౌర
వెలయ వెలుగోటిపినకొండ విభుకుమార
భువననుతశౌర్య పెదకొండ భూపవర్య. 282

క. ఆయన కూరిమి యనుజుఁడు
రాయనరాధిపుఁడు దానరాధేయుఁడు భూ
నాయకరత్నము కన్నడ
రాయార్పితరాజ్యసుఖనిరతుఁడై యొప్పెన్. 283

సీ. సత్యభాషాసమ జ్జ్వలుఁ డౌట సంఫుల్ల
రాజీవనయనవి రాజి యగుట
నలఘుగోత్రధురీణుఁడగుట నగణ్యకా
రుణ్యదాక్షిణ్యని రూఢుఁ డగుట
సంపూర్ణసత్త్వనిశ్చలుఁ డౌట సదసంత
భోగివిహారవి స్ఫురితుఁ డగుట
నురుపుణ్యజనదుఁడై యుంటఁ గృష్ణావర
జీవనసంగతిఁ జెన్నుగనుట
సిద్ధకృతవర్మరక్షణ శీలుఁ డౌట
నాప్తమిత్రకృతాక్రూరుఁ డగుట విలసి
తాధికానకదుందుభి యగుట వెలసె
రాయనరపతి ఖడ్గనారాయణాఖ్య 284

సీ. కట్టించె లోకవిఖ్యాతంబుగా వారి
వారణంబులు వారి వారణములు
నిలిపె నెల్లెడల నెన్నిక కెక్కఁగా భూమి
సురగృహంబులు భూమి సురగృహములు

---

1. A B ఘనవైరి
2. ,, తరలంబు
3. ,, మస్తిష్కాస్థి కపాలకోటి తుత్తునలుగా

చేపట్టి నూర్జిత ఽ శ్రీ లెసంగఁగ[1] ధర్మ
శాస్త్రంబులును ధర్మ ఽ శాస్త్రములును
గాంచె నక్షీణల ఽ క్షణయుక్తి సుకృతిసం
తతులును సుకృతిసం ఽ తతులు వెలయ
నిచ్చె విద్వత్కవీంద్రుల ఽ కెలమి నగ్ర
హారములు పేరుగల యగ్ర ఽ హారములును[2]
సవిధగుండాలవేంకట ఽ స్వామిగాక
రాజమాత్రుండె వెలుగోటి ఽ రాయఘనుఁడు. 285

సీ. ఘోటనిరాఘాటఽధాటిచేఁ బరిపంథి
పట్టణంబుల ధూళిఽపటల మాడ[3]
డమరఢమామిశా[4]ఽఢమఢమధ్వనులచే
గిరిదుర్గములు తల ఽ క్రిందు గాఁగ
ఘనధైర్యగుణధుర్యఽగతిశౌర్యములఁ జేర్చి
ముగురురాజులు కప్పఽములు వహింప[5]
స్వామితంత్రద్రోహిఽజననాయకుల నాజిఁ
దఱిమికొట్టును వనాంఽతరములఁ బడ
భీమసైన్యబలోద్ధూతఽభూమిరేణు
రాజిచుళుకితనిఖిలధఽరాధరుండు[6]
విభవభరితుండు పినకొండఽవిభుసుతుండు
రసికసులభుండు వెలుగోటిఽరాయఘనుఁడు 286

---

1 A. B శ్రీలెసంగుచు
2 ,, కాంచన[క్షీ]ణలక్షణయుక్తి సుకృతిసంతతులు వెలయవిద్వత్కవీంద్రులకెలమి నగ్రహారములు పెరుకల నగ్రహారములను
3 ,, ధూరిపటములాడ
4 A రణఢమామిా ఢమాధ్వనులచే B రణఢమాఢమఢమధ్వనులచే
5. A B. వహించె
6. ,, నిఖిలధరాధురుండు

సీ. ఇమ్మైన సొమ్ముకా[1] ఽ యింతిపే శే మది
ఒొకగొందిపేరింటి ఽ యువిద యేది
మేడపేరన నగు[2] ఽ మించినసఖి యేది
తగఁజేతిపేరిటి ఽ తరుణి యేది
వివరించుమాటలు ఽ వినుపేరి సఖి యేది
మొకములపేరింటి[3] ఽ మెలఁత యేది
నలుదిక్కులకు నొక్క ఽ నలినాక్షిపే రేది
రత్నంబుపేరిటి ఽ రమణి యేది
రమణులకు [నెల్ల] నొక్కఁడె ఽ రాజురాజు
దశమినవముల లెక్కింపఁ ఽ దగిన సతులు
అందులను[4] గల్గుభావంబు ఽ లానతిమ్ము
సరసనత్కవిసద్గోష్ఠి ఽ సార్వభౌమ
వెలయ వెలుగోటిపింకొండ ఽ విభునిరాయ 287

సీ. కలికి సొంపున[5]ఁ బల్కు ఽ విలుకోపునను బూని
వృక్షమా పేరిట ఽ వెలయు నొకటి
వదరుఁ గూఁతలపేరఁ[6] ఽ బాదలి చెట్టుగ నిల్చి
నదితోడఁ గూడంగ ఽ విదిత మొకటి
యరికట్టుమాటలోఁ ఽ గగఖడ్గ మొనరించి
రాజాన్న[7]రుచులలో ఽ రమ్య మొకటి
వలనుగా దని పిల్వఁబోవచ్చిన పేరితో
నరయ ఝుంకారించు ఽ గరువ మొకటి[8]
తివిరి భావంబు చతురత ఽ తేటపడఁగ
నర్థ మిది నాల్గుదెఱఁగులు ఽ నానతిమ్ము

1 A సోమ్మురా
2 A B మెడపెరసనగుచు
3. ,, మెకముతల
4 ,, అందరను
5 ,, సొమ్మున
6 వదురుగూతలపేరు
7 B రాతాన్న
8. A B వచ్చుచు పేరిలో......గురుతుదాని

సరససత్కవిసద్గోష్ఠి సార్వభౌమ,
వెలయ వెలుగోటిపినకొండ విభునిరాయ [1] 288

సీ. కుంతలావంతిక కురు [విదేహ] విదర్భ
[2]మోహనభూముల మొలక మొల్కి,
కాశ్మీరకాంభోజ కరహాటకర్ణాట
వింధ్యదేశములందు వేళ్లు పాఱి
పాంచాలబర్బర బాహ్లికఘూర్జర
సింధుదేశములందుఁ జిగురు లొత్తి
అంగవంగకళింగ బంగాళనేపాళ
పుణ్యదేశములందుఁ బూచి కాచి

ఘనత కెక్కెను నీదానకల్పతరువు
లరిజమోహాయ పట్టితలాటరాయ
ప్రకటధారేయ వెలుగోటిపార్థివేయ
విక్రమోపాయ పినకొండవిభునిరాయ. 289

సీ. మదవిరోధుల[3] శిరోమణులు నేత్రంబులు
దర్పితారాతికేతనము పడగ[4]
దుర్మదవిద్విషచ్చర్మంబు కఁబుసంబు
శత్రువరాట్టహాసంబు మ్రోంత
శాత్రవరాజన్యశల్యముల్ కోరలు
సమదారివీరరసంబు విషము
బిరుసైనపగతుర ప్రేవులు జిహ్వాలు
వినుతరాడ్జీవానిలములు భుక్తి[5]

---

1 A B. రాయవిభుని
2. ,, విదర్భమోహాన భూములలదు
3 ,, మదవద్విరోధుల
4. ,, పడిగ
5. ,, మదితరాడ్జీవానలముభుక్తిగాగ

గాఁగ[1] సోలుచు నాడుచుఁ గడిమి[2] మెఱసి
రణశిరంబున[3] నిల్చి ఘోరాహి యనఁగ
సరగఁ[4] గ్రీడించు నీఖడ్గసర్పరాజు
విమలచారిత్ర పినకొండవిభుసుపుత్ర. 290

సీ. కరమెత్తి నీకు మ్రొక్కనిరాజు లెవ్వరు
గర్జించు బల్లర గండబిరుద
కలనిలో[5] నీకుఁ జిక్కనిరాజు లెవ్వరు
మదవైరివీరదుర్మదవిదారి
అనిలోన నీకు నోడనిరాజు లెవ్వరు
రమణీయఖడ్గనారాయణాంక
వసుధలో నిన్నుఁ గొల్వని రాజు లెవ్వరు
కొసరక రేచర్లగోత్రధీర
అనుచుఁ గొనియాడుదురు నిన్ను నాంధ్రయవన
మగధమాళవనేపాళమత్స్యసభలఁ
బ్రకటధారేయ వెలుగోటిపార్థివేయ
విక్రమోపాయ పినకొండవిభునిరాయ 291

క. మతి నభ్యసింపవచ్చును
బ్రతి లే దన సకలకళలు[6] రానివి రెండే
యతిదుర్లభములు విక్రమ
వితరణములు పిన్నకొండ విభురాయనృపా. 292

ఉ. రాయపనాయఁ డాసుకవి రాజమరున్మణి తిమ్మధారుణీ
నాయకుఁ డాసమస్తజన నాధశిరోమణి పిన్నకొండధా
రేయుఁడు నంతకంటె సుచరిత్రుఁడు తత్తనయాగ్రగణ్యుఁడా
రాయపనేఁడుఁ బూర్వుల తెఱంగునఁ బ్రస్తుతికెక్కె ధారుణిన్ 293

---

1 A B కణగి
2 B కరిమి
3 A B పురంబున
4 ,, చెలగి
5 ,, కదనమున
6 ,, కథలు

వ. అతనియనుజుండు. 294

గీ. ఆమహాబలు సోదరుం ఽ డతిశయిల్లఁ
ప్రతిభటుల గెల్చి నక్రూర ఽ భావ మలర
మెలఁగి యుద్ధవినీతుల ఽ మే లెఱింగి[1]
ధరణి వెలుఁగోటిరంగభూ ఽ వరవిభుండు 295

క. రంగక్షితిపతి సాక్షా
ద్రంగపతిం దెలిపె నతడు ఽ రంగైకదయా
సంగతి నతిసాత్త్వికబు
ద్ధిం గమలావిభవసంభృ ఽ తిం బరికింపన్ 296

*స్రగ్ధర. స్తంభీభూతక్షితీశా ఽ తతపటహధణం ఽ ధాణశబ్దంబు మింటన్
గంభీరాయోధనప్రాం ఽ గణహతయవన ఽ గ్రామణీ కోటిహృద్య[2]
ద్రంభాపై వాహవేళా ఽ ధ్వనితనిబిడవా ఽ ద్య[3]స్వనంబై తగం బ్రా
రంభించున్ రంగభూపా ఽ గ్రణి పటుజయయా ఽ త్రల్ బలోద్దండలీలన్.

వ. అతనియనుజుండు 298

ఉ. ఈక్షితిఁ గాశికానగరి ఽ నీల్గిన మాత్ర లభించు నెంచఁగా
భిక్షుపుఁ గూడు మోచపృథి ఽ వీ[4]తలనాథవతంసు ఖడ్గధా
రాక్షతి మేను వీడిన య ఽ రాతికిఁ గల్గు సుధారసంబు త
ద్భైక్షము మంచిదో యమృత ఽ పానము మంచిదొ యెంచి చూడఁగన్.

సీ. పటికంపు శిలలలో ఽ పలినీడ నీవెంట
వచ్చునె పిలిచిన ఽ వామనయన
పువ్వారుఁ దీగెలు ఽ బోంట్లె నీబడి నిట్టు
లనుచరింపఁగ[5] ధవళాబ్జగంధి
శృంగంబుపై నున్న ఽ సింగంబు లాప్తులె
తలయెత్తి[6] చూడను ఽ దలిరుఁబోఁడి

---

1 A B. మేలెరింగ
2. B P, A B హతయవనకోటిహృద్య
3. A B. తూర్య
4. ,, ధరణీ
5 ,, పువ్వారు దీగెలబోండ్లు నీబడిరొట్లు ననుచరింపగ
6. ,, లాప్తులై తలలెత్తి

కన్నగానసము క్తి పవనంబు శీతమె
సేదార్చుకొనఁగ నోసింహమధ్య
యహహ వశమె పురాకృతమవ ఘటింప[1]
యనుచు సఖి పల్కునీశత్రు సబలఁదెలియ
సమరరఘురామ రేచర్ల సార్వభౌమ
కొండభూపాలయాచభూమండలేంద్ర. 300

సీ. జంభారితనుజాత జంభారితనుజాత
సమభోగరూపశౌర్యములవాఁడు
గంధవాహకుమార గంధవాహకుమార
సమవేగశక్తిసత్వములవాఁడు
కుంభినీధరరాజ కుంభినీధరరాజ
సమరమాశౌర్య[2]ధైర్యము లవాఁడు
రాజశేఖరమిత్ర రాజశేఖరమిత్ర
సమభూతిరుచినిధానము లవాఁడు
జగతి నితఁడనఁ బరఁగుఁ బ్రస్థానసమయ
కల్పితాఖీల[3]పటహభాంకారనినద
ఘటితపటుకర్ణకుహరదికటమదావ
ళేశ్వరుండైన[4] యాచధాత్రీశ్వరుండు 301

వ అతనివనుజుండు. 302

సీ చెలపాది[5]కుటిలుండు చేఁదు[6]పుక్కిటనుండుఁ
జుట్టుగాఁ దిరుగాడుఁ బుట్టనుండుఁ[7]
బామరిరాలలోఁబడి పావనుఁడుగాఁడు[8]
నిర్దయుం డెప్పొద్దు నిద్రపోతు

1 A పురాకృతంబా ఘటింప
2 A B శౌర్య
3. B, P కల్పితాఖిల
4 „ మదాపథీశ్వరుండైన
5 A B 'చదిపాద' 'చలపాది' సరియైనరూపము
6 „ చెఁదు
7. „ చుట్టులాడిదిగాడుపుట్టగుండు
8 „ వామరిరాలలో (A బా) పరిపవనుడుగాడు.

నయ మెఱుంగఁడు ప్రజాభయకారి నడవడి
చక్కఁగా దెంతయు[1] నిక్కలాఁడు
గబ్బి క్రూరుఁడు భయంకరుఁడు దబ్బఱకాఁడు
గణుతింపఁ బెక్కు నాల్కలుగలాఁడు[2]
శేషుఁ డని రోసి భూకాంత చేరి యాఁడు[3]
ప్రేమ మీఱంగ నీబాహు[4]పీఠ మందు
భవ్యచారిత్ర కొండభూపాలుపుత్ర
ధీరతాటోప వెలుగోటితిమ్మభూప 303

క. అమ్మనుజనాథుకూరిమి
తమ్ముఁడు పెదతిమ్మభూమిధవుఁ డుగ్రసమి
త్సమ్మూర్ఛితభూభువనక
కుమ్మద[5]వద్వీరవైరి కులుఁడై వెలసెన్. 304

క. వినుతనయవినయరేఖా
తనుఁడగు[6] పెదతిమ్మవిభుని తమ్ముఁడు వెలయున్
చినతిమ్మక్షోణీపతి
ఘనదానత్యాగవిజితకల్పక మగుచున్ 305

*సీ. కలధౌతకలధౌతకలధౌతనిలయుండు
ఘనసారఘనసారగంధయుతుఁడు
నరసింహనరసింహనరసింహశౌర్యుండు
భారతిభారతీపాటవుండు
వాహినీవాహినీవాహినీశ్వరమంత్రి
సుకుమారసుకుమారశోభితుండు
మణిరాజమణిరాజమణిరాజనిభకీర్తి
కల్యాణకల్యాణకలితతేజుఁ

---

1. A B దింతయు
2. ,, ప్రణుతింప వెక్కునాలుకలవాడు
3 ,, యాడి
4 ,, మీఁబాహు
5. B క। కుమ్మద
6. A. B ఘనుఁడగు

కనుచు జగములు వొగడంగ నలరుచుండు
సమదవిమతవసుంధరారమణసింధు
మంథ[1]జగతీధరేంద్రాయమానబాహు
దండబలహారి వెలుగోటికొండశౌరి. 306

ఆ. ఇలఁ బ్రసిద్ధిఁగన్న యీపదుగుండ్రలో[2]
పలఁ గుమారతిమ్మపార్థివుండు
కొండవిభుఁడు రాయమండలపతియేచ
ధీధనుండు పిన్నతిమ్మనయును. 307

వ. కుమారవంతులై వర్ధిల్లి రందు. 308

చ. ధరణిఁ గుమారతిమ్మవసుధాపతి లక్కమదేవిఁ బెండ్లియై
శరధిశయాను భూరిభుజసాగర వేదములంచు నెన్నఁగాఁ
దిరుపతినేని కొండజగతీరమణుల్ బెదవేంకటావనీ
శ్వరుఁ జినవేంకటాధిపరసారమణుం గనియెన్ గ్రమంబునన్. 309

క. నిరవధికలక్ష్మీ నీప్సిత[3]
వరదానగుణాతివైభవమున ధరిత్రిన్
దిరుపతినాయకుఁ డొప్పెన్
దిరుపతినాయకునిభంగిఁ దేజోధికుఁడై 310

వ. అతనియనుజుండు. 311

మ. పినకొండక్షితిపాలశేఖరుభుజాభీలప్రతాపాగ్ని వై
రినికేతంబులు సొచ్చుఁ దచ్చతురనారీభూరిధమ్మిల్లబం
ధనముల్ నెవ్వడి వీడ్చు నాననసుగంధం బానుఁ జుంబించు న
క్కన రాయన్ వలువూడ్చుఁ[4] జన్నుఁగవ నొక్కన్ బల్లవప్రక్రియన్.

క. అతనియనుజాతు లార్యా
ర్చితు లాపెదవేంకటయ్య చినవేంకటభూ

1 A B మంథ
2 „ పరగ బ్రసిద్ధిగన్న యీ పదుగిండ్రలో
3 „ లక్ష్మీప్సిత
4 „ వలవూడ్చు

పతి జనతానతులై [ధర]
నుతికెక్కిరి [1]రామలక్ష్మణులు చందమునన్. 313

వ సంతతికిఁ దిరుపతినేఁడు మొదలు. 314

క. కురుపతి మానోన్నతికి న [2]
మరపతి తద్ఘటితారిమహిమకు[3] విలస
ద్గురునకుఁ బ్రతి మతి[4] [గిరిపతి]
తిరుపతినరపతి మహాధృతిగా నుతికెక్కెన్. 315

క. తిరుపతినరపతి యుల దా
మర[5]ధర్మక్షోణిపతికిఁ గోమారిత ధర్మాం
బ రమాసమఁ బరిణయమై
పరఁగఁగ[6] బినకొండతిమ్మప్రభువులఁ గనియెన్.[7] 316

వ. అం దగ్రజుండు 317

చ తిరుపతినేనికొండజగతీతలనాథు మహోగ్రఘాటికా
తురగఖురోత్థధూళిజము దూరవిరాగముఖోజ్వల[8]ద్విష
త్కరిగమనాపరంపరకుఁ గంచెలయై పటవాసమై మనో
హరపరిధానమై యహరహం బలుకించుఁ[9] దదీయవల్లభున్ 318

సీ నలువ నెమ్మోము మేడలనాడు[10] తెలిపాప,
పాఁపజందెమునఁ జూపట్టుసామి

1 A B నుతు లొప్పిరి
2. ,, వను
3 ,, మరుపతి తద్వైభ్రతుతారి మహీపతి
4 ,, ప్రతినది తిరుపతి
5 ,, దామెర
6 ,, నరమతు
7. ,, ప్రభుగనియెగా
Though Pinakonda and Timma are mentioned in this stanza as the only sons of Tirupati, he had also two other sons, Ranga and Krishna, whose valour is described below in stanzas 322-327
8 ,, దూరతిరాగముఖాజ్వల
9 ,, యహరహంబులకించు
10. ,, మెడల

గాఁగ[1] సోలుచు నాడుచుఁ గడిమి[2] మెఱసి
రణశిరంబున[3] నిల్చి ఘోరాహి యనఁగ
సరగఁ[4] గ్రీడించు నీఖడ్గసర్పరాజు
విమలచారిత్ర పినకొండవిభుసుపుత్ర 290

సీ. కరమెత్తి నీకు మ్రొక్కనిరాజు లెవ్వరు
గర్జించు బల్లర గండబిరుద
కలనిలో[5] నీకుఁ జిక్కనిరాజు లెవ్వరు
మదవైరివీరదుర్మదవిదారి
అనిలోన నీకు నోడనిరాజు లెవ్వరు
రమణీయఖడ్గనారాయణాంక
వసుధలో నిన్నుఁ గొల్వని రాజు లెవ్వరు
కొసరక రేచర్లగోత్రధీర
అనుచుఁ గొనియాడుదురు నిన్ను నాంధ్రయవన
మగధమాళవనేపాళమత్స్యసభలఁ
బ్రకటధారేయ వెలుగోటిపార్థివేయ
విక్రమోపాయ పినకొండవిభునిరాయ 291

క. మతి నభ్యసింపవచ్చును
బ్రతిలేదన సకలకళలు[6] రానివి రెండే
యతిదుర్లభములు విక్రమ
వితరణములు పిన్నకొండ విభురాయనృపా. 292

ఉ. రాయపనాయఁ డాసుకవి రాజమరున్మణి తిమ్మధారుణీ
నాయకుఁ డాసమస్తజన నాథశిరోమణి పిన్నకొండధా
రేయుఁడు నంతకంటె సుచరిత్రుఁడు తత్తనయాగ్రగణ్యుఁడౌ
రాయపనేఁడుఁ బూర్వుల తెఱంగున బ్రస్తుతికెక్కె ధాత్రిపైన్. 293

---

1 A B కణఁగి
2. B కరిమి
3 A B పురంబున
4 ,, చెలఁగి
5. ,, కదనమున
6. ,, కథలు

వ. అతనియనుజుండు. 294

గీ. ఆమహాబలు సోదరుం । డతిశయిల్లఁ
ప్రతిభటుల గెల్చు నక్రూర । భావ మలర
మెలఁగి యుద్ధవిసీతుల । మే లెఱింగి[1]
ధరణి వెలుగోటిరంగభూ । వరవిభుండు 295

క. రంగక్షితిపతి సాక్షా
ద్రంగపతిం దెలిపె నతదు । రంతైకదయా
సంగతి నతిసాత్త్వికబు
ద్ధిం గమలావిభవసంభృతిం బరికింపన్ 296

*స్రగ్ధర. స్తంభీభూతక్షితీశాతతపటహధణంధాణశబ్దంబు మింటన్
గంభీరామోధనప్రాంగణహతయవన । గ్రామణీ కోటిహృద్య[2]
ద్రంభావైవాహవేళాధ్వనితనిబిడవాద్య[3]స్వనంబై తగం బ్రా
రంభించున్ రంగభూపాగ్రణి పటుజయయాత్రల్ బలోద్దండలీలన్.

వ. అతనియనుజుండు. 298

ఉ. ఈక్షితిఁ గాశికానగరి । సీల్గిన మాత్ర లభించు నొంచఁగా
భిక్షువుఁ గూడు మోచపృథివీ[4]తలనాథవతంసు ఖడ్గధా
రాక్షతి మేను వీడిన యరాతికిఁ గల్గు సుధారసంబు త
ద్భైక్షము మంచిదో యమృతపానము మంచిదొ యెంచి చూడఁగన్.

సీ. పటికంపు శిలలలో । పలిసిడ నీవెంట
వచ్చునె పిలిచిన । వామనయన
పువ్వారుఁ దీగెలు । బోండ్లు నీబడి నిట్టు
లనుచరింపఁగ[5] ధవళాబ్జగంధి
శృంగంబుపై నున్న । సింగంబు లాప్తులె
తలయెత్తి[6] చూడను । దలిరుఁబోడి

1 A. B మేలెరింగ
2. B P, A B హతయవనకోటిహృద్య
3. A B. తూర్య
4. ,, ధరణీ
5 ,, పువ్వారు దీగెలబోండ్లు నీబడియిట్లు ననుచరింపగ
6. ,, లాత్మలె తలయెత్తి

వన్నగాననము క్తి ౯ పవనంబు శీతమె
సేదార్చుకొనఁగ నోకసింహమధ్య
యహహా వళనె పురాకృతకమవ ఘలింప[1]
ననుచు సఖి పల్కు-నిశత్రు ౯ నబలఁదెలియు
ననురఘురామ రేచర్ల ౯సార్వభౌమ
కొండభూపాలయేచభూకుండ లేంద్ర. 300

సీ. జంభారితనుజాత ౯ జంభారితనుజాత
సముభోగరూపశౌర్యములవాఁడు
గంధవాహకుమార ౯ గంధవాహకుమార
సమవేగశక్తిసత్త్వములవాఁడు
కుంభినీధరరాజ౯కుంభినీధరరాజ
సమరమాశౌర్య[2]ధైర్యము లవాఁడు
రాజశేఖరమిత్ర ౯ రాజశేఖరమిత్ర
సమభూతిరుచినిధానము లవాఁడు
జగతి నితఁడనఁ బరఁగుఁ బ్రస్థానసమయ
కల్పితాభీల[3]పటహాభాంకారనినద
ఘటితపటుకర్ణకుహరదిక్కటమదావ
శేశ్వరుండైన[4] యేచధాత్రీశ్వరుండు 301

వ అతనియనుజుండు. 302

సీ. చెలపాడి[5]కుటిలుండు ౯ చేఁదు[6]పుక్కిటనుండుఁ
జుట్టుగాఁ దిరుగాడుఁ ౯ బుట్టనుండుఁ[7]
బామరిరాలలోఁబడి పావనుఁడుగాఁడు[8]
నిర్దయుం డేప్రొద్దు ౯ నిద్రపోతు

1 A పురాకృతంబా భరింప
2 A B శార్య
3. B P కల్పితాఖిల
4. ,, మదాపధీశ్వరుండైన
5 A B. 'చదిపాడ' 'చలపాడి' సరియైనరూపము
6. ,, చేందు
7. ,, చుట్టులాడిదిగాడుపుట్టగుండు
8 ,, పామరిరాలలో (A జా) పరిభవనుడుగాడు.

నయ మెఱుంగఁడు ప్రజాక్షయకారి నడవడి
　　　　చక్కఁగా దెంతయు[1] నిక్కులాఁడు
గబ్బి క్రూరుఁడు భయంకరుఁడు దబ్బఱకాఁడు
　　　　గణుతింపఁ బెక్కు నాల్కలుగలాఁడు[2]
శేషుఁ డని రోసి భూకాంత చేరి యాడు[3]
ప్రేమ మీఱంగ నీబాహు[4]పీఠ మంగు
భవ్యచారిత్ర కొండభూపాలుపుత్ర
ధీరతాటోప వెలుగోటితిమ్మభూప　　303

క. అమ్మనుజనాథుకూరిమి
తమ్ముఁడు పెదతిమ్మభూమిధవుఁ డుగ్రసమి
త్సమ్మూర్ఛితభూభువనక
కుమ్మద[5]వద్విరవైరి కులుఁడై వెలసెన్.　　304

క. వినుతనయవినయరేఖా
తనుఁడగు[6] పెదతిమ్మవిభుని తమ్ముఁడు వెలయుఁ
బినతిమ్మక్షోణీపతి
ఘనదానత్యాగవిజితకల్పక మగుచున్　　305

*సీ. కలధౌతకలధౌతకలధౌతనిలయుండు
　　　　ఘనసారఘనసారగంధయుతుఁడు
నరసింహనరసింహనరసింహశౌర్యుండు
　　　　భారతిభారతిపాటవుండు
వాహినీవాహినీవాహినీశ్వరమంత్రి
　　　　సుకుమారసుకుమారశోభితుండు
మణిరాజమణిరాజమణిరాజనిభకీర్తి
　　　　కల్యాణకల్యాణకలితతేజుఁ

---

1 A B దింతయుం
2. „ ప్రణుతింప పెక్కు నాలుకలవాడు
3. „ యాడి
4 „ మీబాహు
5 B క। కుమ్మద
6. A B ; ఘనుడగు

డనుచు జగములు పొగడఁగ - నలరుచుండు
సమదవిమతవసుంధరా-రమణసింధు
మంథ[1]జగతీధరేంద్రాయ-మాన బాహు
దండబలశౌరి వెలుగోటి-కొండశౌరి 306

ఆ. ఇలఁ బ్రసిద్ధిఁగన్న - యీపదుగుంద్రలోఁ[2]
పలఁ గుమారతిమ్మ-పార్థివుండు
కొండవిభుఁడు రాయ-మండలపతియేచ
ధీధనుండు పిన్న-తిమ్మనయును. 307

వ. కుమారవంతులై వర్ధిల్లి రందు. 308

చ ధరణిఁ గుమారతిమ్మవసు-ధాపతి లక్కమదేవిఁ బెండ్లియై
శరధిశయాను భూరిభుజ-సాగర వేదములంచు నెన్నఁగాఁ
దిరుపతి నేని కొండజగ-తీరమణుల్ పెదవేంకటావనీ
శ్వరుఁ జినవేంకటాధిప-సారమణుం గనియెన్ గ్రమంబునన్. 309

క. నిరవధికలక్ష్మీ నీప్సిత[3]
వరదానగుణాతివైభ-వమున ధరిత్రిన్
దిరుపతినాయఁకుఁ డొప్పెన్
దిరుపతినాయఁకునిభంగిఁ - దేజోధికుఁడై. 310

వ అతనియనుజుండు. 311

మ పినకొండక్షితిపాలశేఖరుభుజా-భీలప్రతాపాగ్ని వై
రినికేతంబులు సొచ్చెఁ దచ్చతురనా-రీభూరిధమ్మిల్లబం
ధనముల్ నెవ్వడి వీడ్చు నాననసుగం-ధం బానఁ జుంబించు న
క్కన రాయుల్ పలువూడ్చెఁ[4] జన్నఁగవ నొ-క్కన్ బల్లవప్రక్రియన్.

క. అతనియనుజాతు లార్యా
ర్చితు లాపెదవేంకటయ్య - చినవేంకటభూ

1 A B మంథ
2 „ పరగ బ్రసిద్ధిగన్న యీ పదుగిండ్రలోఁ
3. „ లక్ష్మీప్సిత
4. „ పలవూడ్చు

పతి జనతానతులై [ధర]
నుతికెక్కిరి [1]రామలక్ష్మణుల చందమునన్. 313

వ. సంతతికిఁ దిరుపతినేఁడు మొదలు. 314

క. కురుపతి మానోన్నతికి న [2]
మరపతి తద్ఘటితారిమహిమకు [3] విలస
ద్గురునకుఁ బ్రతి మతి [4] [గిరిపతి]
తిరుపతినరపతి మహాధృతిఁ నుతికెక్కెన్. 315

క. తిరుపతినరపతి యుల దా
మర [5] ధర్మక్షోణిపతికి మారిత ధర్మాం
బ రమాసమఁ బరిణయమై
పరఁగన్ [6] బినకొండతిమ్మప్రభువులఁ గనియెన్. [7] 316

వ. అం దగ్రజుండు 317

చ. తిరుపతినేనికొండజగతీతలనాథు మహోగ్రఘాటికా
తురగఖురోత్థభూరజము దూరవిరాగముఖోజ్వల [8] ద్విష
త్కరిగమనాపరంపరకుఁ గంచెలయై పటవాసమై మనో
హరపరిధానమై యుహారహం బలుకించుఁ [9] దదీయవల్లభున్ 318

సీ. నలువనెమ్మోము మేడలనాడు [10] తెలిపావ,
పాఁపజం దెమునఁ జూపట్టుసామి

---

1 A B నుతు లొప్పిరి
2 „ వను
3 „ మరుపతి తద్వైభ్రతుతారి మహిపతి
4 „ ప్రతినది తిరుపతి
5 „ దామెర
6. „ నరనుతు
7 „ ప్రభుగనియెన్
Though Pinakonda and Timma are mentioned in this stanza as the only sons of Tirupati, he had also two other sons, Ranga and Krishna, whose valour is described below in stanzas 322-327
8 „ దూరతిరాగముఖాజ్వల
9. „ యుహారహంబులకించు
10. „ మొదల

సామిచ్చి బలుజెట్టిఁ[1] ఽ జంపి నాతనియన్న
యన్నల్లదేవుని ఽ యనుఁగు[2] పట్టి
పట్టిముల్ చెఱసాలఁ ఽ బెట్టిన దొరమావు
మావులపూవిల్తు ఽ మామకొమరు[3]
కొమరుమాటలకు మార్గొట్టిన[4] రావగ
పగరేవ[5] పేరుబ్బు ఽ వాయుపాలు
పాలుగెల్వనఁ గొన్న సేర్పరి వలమురి
మురిపెమున వేల్పుపెద్దను ఽ మోచు పులుఁగు
పులుఁగుచెప్పెడితపసిచే ఽ పుడుకురాయి
రాయతిరుపతితిమ్మ నీర్జాఁగయశము. 319

సీ. ఉబ్బురెప్పలు విచ్చి ఽ బిబ్బిన సొర నేర్చి[6]
యూరుపుగాలికి[7] ఽ నోసరిలదు
కవుదుదేరకవాసనవుర చేతుల నప్ప
ళించి స[8]గ్గటనిటఁగొంచెపడదు
కైఁజుట్టుకొన్న సైకపుకసీను రుమాలు[9]
తుడుపులకోడి[10] గొందులకు డిగదు

---

1 A B జట్టి
2 A యన్నల్లదేవర యడ్గుపట్టి, B యన్నల్లదేవర యడుగపట్టి
3. B మామరుకొమారు
4 B మాటలకుమార్గొట్టిన
5. A B రేవపెరుబ్బు
6. ,, నొరనేర్చి
7. A ఖాలి, B. భాలి
8. A B కవుదు దేరకవాసన వురచేతులనప్పళించి సగ్గట నిటకొంచపడదు
9 ,, కశిదురూమాలు
10. A. గొరకు, B గొడకు

దవులతా బాదు[1] గంధపుకాశితంబుఁ[2]
బలుమారుసద్దిఁ[3] బాసపడక
మధురసాస్వాదమదఘూర్ణ మానయువన
పరివృఢా[4]పేక్షణాశ్లిష్ట పవనజనన
తిరుపతినృపాలుతిమ్మభూవర త్వదీయ
ఘాటికాఘోటకఖురోత్థ[5] ధరణిధూళి 320

ఉ నీచిరదానవారితటినీపతి నాని పయోధి మించుఁ ద
త్సేచన[6]వర్ధమానతృణసేవ సమస్తము నిచ్చు దేవతా
నైచికి తత్కరీమభజన స్మృతి[7]కల్పక మిచ్చు సర్వదా
త్రాచరణంబు నీవలన నైనది[8] తిమ్మనృపాలశేఖరా. 321

ఉ దేవమహీజ మందె నొకదిక్కున మంజరి[9] చంద్రుఁ డందెఁ దా
రావళి వార్షికాంబు[10]ధరయందె నుదాహరణంబు వీతసం
భావన మింటివార్తలవి మన్నన నీవలె నెవ్వరందిరెం
తే వసుధాస్థలిన్ దియపతిప్రభుతిమ్మ మహాప్రబంధముల్. 322

సీ శ్రీరామపాదరాజీవయుగ్మమరంద
రసమి[11]శ్రమత్తసారంగ రంగ
పరవరాధిన్యుత్థపటహాదంధణవిస్ఫు
రద్రావనృత్యత్తురంగ రంగ

---

1 B దవులతో బాదు
2. ,, కాశితంబున
3. ,, సధిన
4. A. B. పరివృఢా
5. A ఖురాద్ధధరణిధూళి
6 ,, త । చ్చేచన, B చ్చేచన
7. A B భజన్మణి
8 ,, ధా । త్రీచరణంబు నైనధి
9 A మంజలి
10. A B కంబు.
11. ,, సమ్మిళ

రిపువపుర్విగళితాఽశ్రితజయశ్రీపరి
రంభశుంభద్ద్రోణఽరంగ రంగ
కీర్తినిర్జితకార్తిఽకీచంద్రభవమహీ
ధ్రపటీరగంగాతఽరంగ రంగ
సకలసుకవీంద్రగాయకఽసరసవిబుధ
రక్షదక్షిణవిమలాంత[1]ఽరంగ రంగ
తరుణలావణ్యవిజితకంఽదర్పదర్ప
నిరతశోభాంగ తిరుపతిఽనేని రంగ. 323

సీ. వినవచ్చె నదె ఏరఽవేశ్యాభుజంగుని
జయభేరికాస్ఫురఽచ్ఛంఖరవము
కన్పట్టె నల్లదె ఽ గాయగోవాళుని
ధవళాతపత్రకేఽతనచయంబు
చనుదెంచె నదె రాయఽచౌహత్తమల్లుని
గజతురంగానేకఽఘనబలంబు
మార్కొనె నదె మీఱటి ఽ మన్నెహంవీరుండు
గాండివి వైఖరిఁ ఽ గదనమునను
ననుచు నీధాటికిని నోడి ఽ యహితు లెల్లఁ
గాన కేఁగిరి నిను నాజిఁ ఽ బూనలేక
సూనశరగాత్ర తిరుపతిఽనేనిపుత్ర
సంగరాటోప వెలుగోటిఽరంగభూప. 324

సీ. గర్వదుర్వారభీఽకరశత్రునాయక
భూధరంబులకు దంఽభోళిధార
శుంభద్భుజారంభఽదంభశాత్రవరాజ
కుంభీంద్రహర్యక్షఽడింభకంబు
కుటిలప్రచారవిఽస్ఫుటవైరిభూపాల
జలధరోద్ధూతజంఽఝానిలంబు
సంగరపాటవోఽత్తుంగారిభూనాథ
పాథోధిజిద్బడఽబాగ్నికీల

---

1. A రక్షణ రక్ష విమలాంత, B రక్షణక్షణవిమలోత్త

నీకరాబ్జాతసంభూతనిబిడహేతి
యార! యుద్దండవృత్తివీరాగ్రగణ్య
భళిర! వెలుఁగోటితిరుపతిప్రభుకుమార
రంగధీర మహాహవాగ్రశాత్రవవిదార 325

చ. దురమున వైరిరాజులను దోర్బలశక్తిని ఖడ్గధారచేఁ
గరకరి గాఁగఁ జంపుదువు ఖండితవిక్రమ రాముకైవడిన్
గురుతరకీర్తిహార వెలుఁగోటిధురంధర మేలుమేలురా
తిరుపతినేనిరంగ సుదతీనవమోహనపంచసాయకా 326

సీ. మత్తారిభూపాలమస్తకంబులె కాని
ఖండించ దార నీఘనకరాసి[1]
వైరిధాత్రీనాథవక్షంబులే కాని
వరుస మెట్టదు నీదు వరహయంబు
విరసావనీంద్రుల వెన్నుపైనే కాని
తాఁకదు నీచేతి తఱటుపెట్టు
గర్వితాహితరాజగాత్రంబులే కాని
కాలరాయదు[2] నీదుగంధగజము

శత్రుమదభంగ రాజవేశ్యాభుజంగ
దండితారాతి బల్లరగండబిరుద
ప్రకటచారిత్ర తిరుపతిప్రభుసుపుత్ర
కీర్తివిస్తార వెలుగోటికృష్ణధీర. 327

సీ. మత్తవిద్విషబాహుమధ్యవిధులఁగాని
వేడెంబు లిడదు నీ విజయతురగి
కిల్బిషాహితగర్భకీలాలములఁగాని
పానంబు గొనదు నీభద్రకరటి[3]

---

1 A B కరాళి
2 ,, ఖండించదార
3. ,, కరము

గంధాంధ[1]శాత్రవకంధరంబులఁగాని
చేరదు రోఁజకు నీచేకరారి
ప్రతిభటోద్భటవీరభటకోటిపైఁగాని
కదియుడు నీసముత్కటభటాళి
భళిర ! ప్రతిగండ భైరవపంచపాండ్య
దళవిభాళనుహాబిరుదప్రసిద్ధ
విజయవెలుఁగోటి తిరుపతి విభు[2] కుమార
విమలచారిత్ర కృష్ణపృధ్వీకళత్ర 328

వ. ఆపెదకొండప్పనేని వంశావతారం బెట్టి దనిన. 329

క. ఘనుఁడు పెదకొండభూపతి
ఘనకైశిక యల్లమాంబికం బరిణయమై
కనియెఁ బెదతిమ్మవిభుఁజె
న్నన రేశుని వేంకటాద్రి నాధవతంసున్[3]. 330

వ. అం దగ్రజుండు 331

ఉ. ధే యని పెద్దకొండజగతీవరు తిమ్మనృపాలుఁ డాగ్రహా
ప్రాయమనీషి వాజిఁ బఱపన్ వెలి వగ్గలమై[4] తెరల్పఁగాఁ
బోయి విరోధు లుగ్రవనభూములు సొచ్చి ఫలచ్ఛదోదక
స్వీయ[5]విధేయులై యనుభవింపుదు రుగ్రతపస్విధర్మముల్ 332

వ. అతని యనుజుండు 333

సీ. అరిమనోమండలం బర్కమండలమును
భయమంది పటపటపటనఁ బగుల
రణభోగసంవ్యాప్తి రంభావధూప్రాప్తి[6]
తమకించి తటతటతటను నదర

---

1 B గంధాంబ
2 A B ప్రభు
3 B. తిమ్మబరువిభుచన్నవరేశు వెంకటాద్రినాథవతంసున్
4 ,, వెలవగ్గలమై
5 ,, స్థేయ
6. A. రంభావసవ్యాప్తి B రంభాపసవ్యాప్తి

భటపంతరవము సుఽద్భటకుంభరవమును
బెనఁగొని పెటపెట ఽ పెటను నగడ[1]
శరనికాయంబును ఽ శాత్రవనయనాశ్రు
తోయంబు తొటతొట ఽ తొటను దొఱఁగఁ[2]

జిత్రమైయుండు నీదండఽయాత్రమహిమ
ధాత్రి ముక్తాతపత్రితోఽద్దండకీర్తి
విభవవిస్తార పెదకొండఽవిభుకుమార
సింధురాటోప వెలుగోటిఽచెన్నభూప. 334

వ. త దనుజుండు. 335

చ. కలగలరాజు నిండుదయ ఽ గల్గినరాజు మొగంబునందు న
వ్వలరెడురాజు నీతి వినఽయంబుల మించినరాజు శాంతిచే
బలసినరాజు పాడియును ఽ బంత మెఱింగినరాజు కీర్తులన్
వెలసినరాజు కొండవిభుఽవేంకటనాథుఁడు రాజమాత్రుఁడే. 336

ఉ. శ్రీలలితుండు వైరిగజఽసింహుఁడు దాతలచక్రవర్తి ది
క్కూలితకీర్తి నీతిపదఽఖేలనలోలుఁడు ధర్మకర్మసం
శీలుఁడు సుప్రసన్నగుణఽసింధువు మాపెదకొండధారుణీ
పాలుని వేంకటాద్రి ధృతి ఽ పాకహిమాద్రి నృపాలమాత్రుఁడే. 337

వ సంతతికిఁ జెన్నప్పనాయఁడు మొదలు. 338

సీ. గండికోటాదిదుఽర్గము లనర్గళశక్తిఁ
జలపట్టి సాధింపఁఽగలఁడె యొకఁడు
కుతుపనమల్కాపం ఽ పతిభయంకరవృత్తి
గదిసిన డీకొనఁఽగలఁడె యొకఁడు
కయ్యంబులో మన్నె ఽ కంఠీరవులకెల్లఁ
గన్నాకుగా నిల్వఁఽగలఁడె యొకఁడు
తననిజస్వామికి ఽ ఘనజయాంగనలను
గైకానుకలు సేయఁ ఽ గలఁడె యొకఁడు

1. A B లనుగొని పెటతటతటనునదుర
2 ,, తమకించితటతటనునదుర



15

నీవిధంబునఁ గరినరిశ్రీద్రయవన
వాహినీ ఘోరర క్తప్రవాహనివహ
నవ్యసంధ్యాయమానవిస్నాజలౌఘు[1]
చిత్రితాటోప వెలుగోటిచెన్నభూప 339

సీ. నీపేరు చెప్పిన నిష్ఠురారాతిబిం
బోష్ఠుల గర్భంబు లూడిపడును
నీడాకఁ జూపిన నిర్ధూమధామమై
పరభూము లూడనిబాడుచుండు
నీపంపుమాత్రాన నిజభుజాహంకార
మన్నరాజన్యుల మదము లణఁగు
నీవు ముట్టిదైన నిఖిలదుర్గాధిప
ప్రకరంబు గుండెలు పగిలిపాఱు
సాహసంబున నీయంత సార్వభౌముఁ
డరయ నెవ్వఁడు మూఁడు సింహాసనముల
భూరిగుణహార వెలుగోటిపురవిహార
భాగ్యసంపన్న కొండభూపాలుచెన్న. 340

ఉ. క్రొత్తలుగాఁగ నేఁడు వెలుగోటిధురంధర చెన్న నీవు దం
డెత్తినవార్త [మున్నుగను] పొంకించత వినంబడెనేని భీతిమై[2]
మత్తవిరోధిరాజు లభిమానము లూడిచి యెక్కడెక్కడేఁ
జొత్తురుగాక నీ కెదురు శూరులు లేరు ధరాతలంబునన్ 341

సీ. యక్షరక్షఃకులాధ్యక్షశిక్షణదక్ష[3]
దీక్షోపదేశి నీదృఢబలంబు
జంభసంభేదిదోస్తంభదంభోళిసం
రంభగుంభనము నీరణవిధంబు

---

1. A B నవ్య సంధానమానవిస్నాజితౌఘు
2 ,, దం।డెత్తినవార్త యొకింతవినంబడెనేనిభీతిమై
3 ,, అతులరక్షఃకులాధ్యక్షదీక్షణ

ఘోట ఘోటీనిరా ఘాటఘాటీసము[1]
త్పాటితక్షోణి సీప్రబలధాటి
భీమభీమాలికాఱామఘామధ్వజ
స్థేమధామంబు[2] సీతేజ మహహా.
ప్రస్తుతింపంగ దరమె దుర్భరవిరోధి
కంఠరక్తావగాహోగ్రఖడ్గజనిత
విజయరేఖాధరీభూత[3]విక్రమార్క
వీర్య[4]సంపన్న పెదకొండవిభుని చెన్న. 342

ఉ. బల్లిదమైన బెబ్బులికిఁ బాఱుమృగంబులరీతిఁ గాక యీ
చిల్లర మన్నెమూఁకలు విజృంభణవృత్తికి నానఁ బూనునా
బల్లరగండమూర్తి రణభార్గవరాముఁడు కొండధారుణీ
వల్లభుచెన్నుఁ డాజి కిదెవచ్చె నటంచు బరువెత్తు మృత్యువున్. 343

సీ. తారాధిపతియును దారాధిపతియును
దారాధిపతియు సీతరమువారు[5]
కమలాధిపతియును గమలాధిపతియును
గమలాధిపతియు సీకరణివారు
పద్మాధిపతియును బద్మాధిపతియును
బద్మాధిపతియు సీపగిదివారు[6]
ఖచరాధిపతియును ఖచరాధిపతియును
ఖచరాధిపతియు సీకడిమివారు[7]
శేముషీసత్కళాజ్ఞానిశేషమాత్ర
తాపసైర్మల్యవాగ్ధనుర్దైర్ఘ్యపుణ్యప్ర

1 A B ధాటీకనో
2 ,, దామంబు
3. ,, రేఖాదరీభూత
4. ,, వీర
5. A తరమువాడు, B కరణివాడు
6. A పగిదివాడు, B సీకరణివాడు
7. A B కరణివాడు

ఖితరణస్థేమభోగైకవితరణముల
జిష్ణుతాటోప వెలుగోటిచెన్నభూప 344

వ. అతనికుమారులు. 345

చ. అనుపమశీలఁ గొండవసుధావరు[1] చెన్నని వేంకటాద్రి పా
వనగుణశీలుఁడై యుభయవంశపవిత్రకుఁడై బలాఢ్యుఁడై
ఘనుఁడయి కీర్తిమంతుఁడయి గర్వితవైరివిభాళుఁడై జగ
జ్జనవరపూజ్యుఁడై నిజభుజాసముపార్జితరాజ్యుఁడై మనున్. 346

వ అతనియనుజుండు 347

సీ సకలవిద్యల భోజుసాటికి[2] వచ్చు స
ర్వజ్ఞసింగక్షమారమణుఁ డొకఁడు
బిరుదుమన్నీలపైఁ బనుతించు మ్రొక్కులు గొను
గనితిమ్మధారుణీకాంతుఁ డొకఁడు
శూరులు మెచ్చ నూఱాఱుగెల్పులు గెల్చి
మీఱు కస్తురిరంగశౌరి యొకఁడు
సింహాసనస్థులచేఁ బూజఁ గాంచు మీ
తండ్రి చెన్నప్రభూత్తంసుఁ డొకఁడు
అందఱను మించి పద్మనాయకకులంబు
వెలయఁ జేసిన మరువంపుఁ దొలక వౌర
బుధజనాధార వెలుగోటిపురవిహార
యతులగుణజాల వేంకటపతినృపాల. 348

మ. భళిరా! యప్రతిమానదానగుణశుంభన్మానుషఖ్యాతులన్
గలరా నీసరి రాయమన్నదొర లీకర్ణాటకక్షోణిలో
నలనాసత్యసుభాకృతీ విదళితోన్మత్తారిధాత్రీపతీ
వెలుగోటీపురధామ వేంకటపతీ విద్వన్నుతోద్యన్మతీ 349

---

1. B వసుధామర
2. A B భోజునికిసాటికి

సీ. రాజులలోఁ దిమ్మ రాజుదే ధైర్యంబు
మన్నీలలో నీదె మగతనంబు
పెనుగొండనుండి వచ్చిన దాడి[1] తెగువకు
గట్టైన బద్దలు[2] గాక యౌన
దొడ్డ కొంచెముఁ జూచు దొరల గండఁడు[3] వాఁడు
ప్రతిగండభైరవ ప్రతిభ నీది
ఎలగోలు చిల్లరబలము లానవు[4] వాని
పూని నీకై జీతమాని సార
వేడ్క నినుఁ జేరె సంగ్రామ విజయలక్ష్మి
రంభ కౌఁగిలిఁ జేరె నారాజవరుఁడు
భళిర ! వెలుగోటిచెన్నభూపాలపుత్ర
భవ్యగుణశీల వేంకటపతినృపాల 350

సీ. కరలెనా భారుల కుటికి యెంతటి దునే
దారి నైనను జెండి పాఱవైచు
నిచ్చెనా కోర్కెల నిచ్చి తాడోపతం
డములుగా నర్థిసంతతులఁ బ్రోచుఁ
జేరెనా హొయలు మిటారికత్తెలకు సా
త్తాన్మన్మథునివలెఁ గానుపించు
నవ్వెనా నిండుపున్నమపండువెన్నెల[5]
చల్లి కొల్వెల్ల[6] రంజిల్లఁ జేయు

---

1 A దాని, B దాగి
2. A గట్టైబద్దలుగాక, B గట్టైబథలుగాక
3. A. గంన్నడు, B గున్నడు
4. B లావు
5. A B వెన్నెలలు జల్లి
6. ,, కొలువెల్ల

సట్టరాహుత్త[1] సంతతత్యాగభోగ
భాగ్యశాలి పదానతపరనృపాల
పాళి[2] వెలుగోటిచెన్నమ[3] ప్రభుకుమార
హేళి[4] వేంకటపతిమహీపాలమౌళి 351

సీ. ఒకపాటికుట్ర[5] మన్నెకుమాళ్లు[6] నూటార్లు
గూడినఁ గన్నెత్తి చూడఁగలరె
యటుగాక రాయ లంతటి వజీరులు వేవు
రైనను నీవాటు కాఁగఁగలరె
డాక నంతటి[7] కిరీటముల రాజులు లక్ష
చేరిన నెదురాని పోరఁగలరె
మఱి పాకశాహులె మెఱసి కోట్లకొలంది
నిలచి పోరిన మీఱి గెలువఁగలరె
బలయు నీ దుముదారుపంపులకు నలుకు
హరు మరుత్సుతులైనను దుది నిజంబు[8]
విన్నవించెద వెలుగోటిచెన్నభూమి
పాలకుని వేంకటపతీంద్ర భాగ్యసాంద్ర 352

సీ. మునుమున్నె తనధమాధ్వని[9] విరోధినృపాల
కుల దుర్గములు పెళాపెళలు[10] సేయ
నటుచేరఁ దనతేజి పటుహేష లరిభూభు
జుల గుండియలు గులాగులలు సేయఁ

---

1 A B అట్టిరావింత
2 „ పాళి
3 „ చెన్న
4 „ హేళి
5 A కుట్ర, B కట్ట
6. A B కుమార్లు
7 „ నంతటి
8. „ యిది నిజంబు
9. „ ఢమామిధ్వని
10. „ పెళాపెరలు

దరి నెక్కఁ దనహేతి । తతవైరిరాజన్య
మకుటాగ్రములు వకా।వకలు సేయ
మఱి మీఱి తనధాటి । మహనీయబిరుదాంక
ములు వారిధుల బెళా।బెళలు సేయ
మించె నిదె గాయగోవాళ।పంచపాండ్య
దళవిభాళాదిజాగ్రదు।దగ్రబిరుద[1]
పాళి వెలుగోటిచెన్నప।ప్రభుకుమార
హేళి వేంకటపతి[2] మహీ।పాలమౌళి 353

సీ. సర్వజ్ఞసింగభూ।జాని సద్గుణవార్ధి
యాలవాలంబుగా । నంకురించె[3]
నిర్వాణరాయమ।హోర్వీరమణశౌరి
నవకృపావృష్టిచే[4] । ననలుసూపె
గనితిమ్మధరణీ।జననాథమూర్ధన్య
జిష్ణువైభవమునఁ[5] । జెట్టుగట్టె
మీతండ్రి చిన్నప।మేదినీశ్వరు[6] భుజా
శక్తిచే శాఖోప।శాఖ లయ్యె
నేఁడు భవదీయసద్గుణా।నీకగరిమఁ[7]
బూచి కాచి ఫలించె సం।పూర్ణకీర్తి
పండఁబాఱిన వెల్గోటి।వంశశాఖి[8]
ప్రకటితాటోప వేంకట।పతిమహీప 354

---

1 A జాగ్రదుదగ్ర, B జాదుదశ్రీ
2 A B వెంకటుమహీ
3. ,, నంకురించి
4. ,, నవకృపాదృష్టిచే
5 A మూర్ధన్యముజిష్ణు వైభవమున, B మూర్ధన్య ..ష్ణు వైభవమున
6. A B చెన్నపృథ్వీశ్వరు
7. ,, నీపగరిమ
8. ,, పాటువారుని శాఖవెల్గోటివారు

శా. భీషల్ వాతెను దిక్తటంబు నగముల్ బెట్టూఁగె నంభోనిధుల్
షేటుం బాసెను నీటఁ జుండరవిదీప్తిక్[1] మాసెఁ బో నీ దమా
మీటోకించిన శాత్రవుల్ చెదర కేమీ నిల్తురే యాజి వె
ల్గోటీచెన్ననృపాలువేంకటపతీ లోకైకరమ్యాకృతీ. 355

శా. అంధీభూతము లౌ దిగంతరము లుద్యజ్జంతుసంఘంబుతోఁ
గంధుల్ ఘూర్ణిలుఁ గొండ లుర్విఁ బడు దిగ్దంతుల్ వెసం గ్రుంగు నీ
ధంధంధాణధమామికార్భటికి నై దర్పారిదంభాటవీ[2]
గంధేభా వెలుగోటివేంకటపతిక్ష్మానాధకంఠీరవా. 356

సీ. అసిలోన గెల్చి తెచ్చిన గజంబులఁ[3]గాని
సజ్జారనములఁ గట్టి సాకఁబోడు
బిరుదమన్నెకుమాళ్ల బింబాధరలఁ[4] గాని
చెఱలఁ బట్టించఁ దుర్ధురత మెఱసి
గడివిరోధుల మాంసఖండంబులే కాని
భుక్తిసేయఁడు ఖడ్గభూతమునకు
సాహసోద్భటవీరరాహుత్తులనె కాని
పాటింపఁ[5] డితరభూపతుల సరణి

అతఁడు సగరగాంగేయవితతశౌర్య
గాయగోవాళఖడ్గనారాయణాది
బిరుద వెలుగోటి[6] చెన్నభూవరసుతుండు
ప్రధనవిజయుండు వేంకటపతిఘనుండు. 357

వ ఆరాయప్పనేని వంశావతారం బెట్టి దనిన. 358

క. వెలుగోటిరాయనరపతి
కలితమునక్[7] లింగమాంబికం బరిణయమై

---

1. A B జంధిరవిదీప్తుల్
2 ,, దంభావనీ
3 ,, గజంబులనె
4 ,, బింబాధరలె
5 ,, పాలింప
6 ,, బిరుదువెలయు వెలుగోటిచెన్న
7 ,, కలితమునలింగ

